354. చిత్తవిభ్రమమున జీవేశ్వరులు వేఱు
వేఱటంచు దలచు వెఱ్ఱివాడు
కలిసియుండుగాదె ఘటమఠాకాశముల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

355. జననమరణదుఃఖ సాగరమ్మున నుండి
పరమపదము చేర్చు గురువరుండు
నిత్యసత్యమైన ప్రత్యక్ష దైవమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

356. నాదియన్న బంధనమ్ముల జిక్కను
నీదియన్న చెఱల నిర్గమించు
నీది నాది యనక నిర్గుణబ్రహ్మమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

357. కాలరూపిణివిగ శూలధారిణివిగా
పూజలందు దేవమోహినివిగ
భద్రకాళివంచు భజియింతు రార్యులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

358. వేదధర్మములకు పాదైన చోటులు
నిన్ను సంస్తుతించి వన్నెగనియె
దివ్యతత్వ మీవె భవ్యరూప మ్మీవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

359. సూక్తములను నీవె సూత్రమ్ములను నీవె
ఉపనిషత్తులందు నుంటి నీవు
నీవు లేనిచోటు నింగి నేలను లేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

360. పుటుకతోడ జ్ఞానమును పొందు సిద్ధుండు
యోగమునకు జ్ఞాన మొందు యోగి
నీ కటాక్షలవము సోక ధన్యులు జనుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

361. సాంఖ్యయోగములను సాధింప వచ్చును
బ్రహ్మపదము చేరవచ్చు దాన
రాజయోగులకును రాచబా టదిగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

362. నిరుపమానమైన నిశ్రేయసము నించు
తరతరాల కర్మతతుల ద్రెంచు
శిరముపైని చేయిచేర్చి సద్గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

* 363. శ్వాసకోశములను చక్కనుంచెడి వాడు
స్నాన పాన భోజనముల నెఱిగి
చేయువాడు యోగసిద్ధు డాచార్యుడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

364. తళుకుబెళకు వస్త్రములు దాల్చువారలు
వ్రేళ్ళ నుంగరములు పెట్టువారు
వాని విలువ దప్ప వారికి వెలలేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

365. జిహ్వారుచుల కొఱకు జీవితలక్ష్యమే
విడుచువాడు తత్త్వవేత్త కాడు
నాల్క గట్టువాడు నారాయణుం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

366. సర్వజీవులందు చైతన్య మొకడంచు
జాతి మతము లెంచి సణుగువారు
అందలేరు సచ్చిదానందసౌఖ్యమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

367. సారహీనమైన సంసారసుఖదుఃఖ
ములకు లోగువాడు మూర్ఖజనుడు
సాక్షిమాత్రుడైన సర్వేశతుల్యుడౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

368. ఆగమమ్ములను మహారణ్యమున బడి
ఆగమగుట యేల? అంబ! నిన్ను
ఆత్మ దలచి మోక్ష మందిన చాలదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

369. మాటలకును మాఱుమాటలు పల్కుట
నోటి తీటగాని బాటగాదు
వాద ముడుగువాడె నీదరి చేరును
కాళికాంబ! హంస! కాళికాంబ!

370. శోకరహితమైన చోటుకు జేరగా
కోరువారె నిన్ను జేరువారు
నిశ్చయముగ మనసు నిల్ప నీదయగల్గు
కాళికాంబ! హంస! కాళికాంబ!

371. వేదమంత్రములను వాదించి విడిచిన
విధి నిషేధ శాస్త్రవేత్తలైన
గుణము కుదురకున్న నిను గాంచగా లేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

372. సడలనీనిభక్తి సామీప్య సారూప్య
ములకు జేర్చు తుదకు ముక్తి గూర్చు
నీవె తానుగాను నిల్చు సాయుజ్యమై
కాళికాంబ! హంస! కాళికాంబ!

373. పారమార్థికముగ బ్రహ్మాత్మతత్వమ్ము
లెఱుగ గోరువారు గురుని జేరి
కొలువవలయు నిలిచి గురుతర గురుభక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

374. ద్వేష మింత లేక వేషమ్ము పస లేక
శత్రుమిత్రులందు సమత గలిగి
బంధముక్తు డగుట భక్త లక్షణమగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

375. సంప్రదాయముగను సద్గురు సచ్ఛిష్య
మార్గముల నెఱింగి మదిని నిన్ను
దలచువార లెల్ల ధన్యులు మాన్యులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

376. పరము గోరు శక్తి గురువునం దనురక్తి
కాళికాంబయందు గలుగుభక్తి
మూడు పూర్వసుకృతమున గల్గు జీవికి
కాళికాంబ! హంస! కాళికాంబ!

377. అత్త,కోడ లీర్ష్య రాగడమ్ములు మాని
ఒకటిగాగ నుంట నుర్వి లేదు
అత్తలేనికోడ లుత్తమరా లంద్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

378. నేనె బ్రహ్మ మనుచు నిర్దిష్ట నిర్దుష్ట
ముగను బలుక జనులు తెగడినారు
బాధగురువు లిదియు బోధగా దన్నారు
కాళికాంబ! హంస! కాళికాంబ!

379. సర్వమతములందు సారమ్ము గ్రహియించి
ఐకమత్యమార్గ మనుసరించి
క్రించుదనము మాని ప్రేమించుకొన మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

380. భవుడు దిక్కటన్న భక్తులకే కాక
కాడు దిక్కటన్న ఘనుల కేల
స్వర్గ నరక మోక్ష సంవాసముల గోల
కాళికాంబ! హంస! కాళికాంబ!

381. పాపరూపమైన తాపత్రయాదుల
పరిహరించి జయ,శివంకరముల
చేర్చికూర్చు తల్లి శివశక్తి వీవెగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

382. పరము దిక్కటంచు దిరుగుచు నుండగా
[1]కల్లగుల్ల గురుడు కానవచ్చె
చుండునెత్తిమీద నుండిన పేనుగా
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

381. తాపాపహారిణీం దేవీం
భుక్తిముక్తి ప్రదాయినీం
అనంతాం విజయాం శుద్ధాం
శరణ్యాం శివదాం శివామ్. (దేవ్యుపనిషత్తు - 19)

1. కల్లగుల్ల=అసత్యములాడు

383. ఆత్మలోని జోతి నారగించగవలె
ప్రాణలింగ మరసి బ్రతుకవలెను
బయలు జ్యోతి జూచి ప్రకృతిని గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

385. నాల్కమీద జాతినవరత్నముల గూర్చి
ఆదిదేవు ధ్యాన మందవలెను
నమలి రుచినిగన్న నారాయణుని గను
కాళికాంబ! హంస! కాళికాంబ!

386. నోటి నాల్కసందు పాటిరోకలి యున్న
రామభజన చేయరాదు నోట
పాపకర్మనోట పట్టునో పట్టదో
కాళికాంబ! హంస! కాళికాంబ!

387. నోరు బరిణెయందు నారాయణుం డుండు
దివ్యమైన స్థలము దెలియ నాయె
తిరిగి తెలియలేరు దివ్యస్థలంబని
కాళికాంబ! హంస! కాళికాంబ!

388. శిష్యునకును బోధచేసెడి గురుమూర్తి
సంశయముల నెల్ల సమయజేయ
తత్వ మెఱిగి యతడు ధన్యోస్మి యనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

389. వాక్కు బ్రహ్మమనుచు వర్ణింప నేరరో
చూపు నీశు డనుచు చూడలేరా
కోర్కి విష్ణు వౌట కొనసాగ నీయరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

390. బ్రహ్మ మనగ వేఱె పరదేశమున లేడు
బ్రహ్మమనగ జూడు బట్టబయలు
తనకు దానె బ్రహ్మ తారక మౌనురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

391. తనుకు దానె బ్రహ్మ తారక మెట్లొను
తొలుత నోముఫలము తెలిసి యుంటె
అనుకూల్యవతియె యా మహాబ్రహ్మయౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

392. న్యాయ మేమటంచు నసిగేరు పెద్దలు
పిన్నవారి కెల్ల పేరు లేదు
బ్రహ్మ మరయువారి భ్రమ లిట్టు లుండునా
కాళికాంబ! హంస! కాళికాంబ!

393. ప్రమథనాథుగూర్చి పఠన చేయగవలె
కఠిన చిత్తుకైన శఠునకైన
అహము శూన్యమైన హఠయోగులకు నైన
కాళికాంబ! హంస! కాళికాంబ!

394. [1]దీప్తమైన గురుడు దేహమం దుండగా
దాహ [2]శూకలంబు దగ్ధమాయె
నిద్రమోహములను నిలిచి సద్గురు డుండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

395. వినుము తల్లి! నీకు వినిపింతు నొకవార్త
కనుము తల్లి! గురుని కాంక్షలేక
మనుము తల్లి! ఆత్మమహిమంబు తెలిపెద
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. దీప్తము=సింహము, 2. శూకలము=దుష్టాశ్వము

396. పేరు మనసుమాయ పెనుబాము సమమౌను
పెద్ద బ్రహ్మపేర పిలువనాయె
మనసు వాయు వవుట మరియాద తెలియరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

397. గురుధనము [1] గుడారు [2]గూర్చి వేసితెకాని
అగరు గంధములను నలదినటుల
మానసమున కెన్ని మాయలు చెప్పుమా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

398. గురునిబుద్ధియందు గూర్చి వేసినయట్లు
పట్టువిడుపు లేక పట్టవలెను
పట్టుకాలు పట్టి పట్టుగా పట్టుడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

** 399. పట్టు పట్టెనేని పట్టు వీడగరాదు
పట్టు వదలెనేని పదవిలేదు
పట్టి విడుచుకంటె ప్రాణమ్ము [3]లిడ మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

400. గురునిసూత్రమైన కుక్కలు గలవవు
గుణము లేకయున్న కుక్క గలుచు
కుక్కకున్న గుణము గురునకు లేదయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

401. గురుడు గురునిగుణమె కుక్క కుక్క గుణమ్మె
ఒక్కటైతె రెండు చక్కనౌను
చక్కనైన గుణమె యెక్కువౌ లెక్కింప
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. గుడారు=డేరా, 2. కూర్చి=అలంకరించి, 3. ఇడు=విడిచిపెట్టు

402. దగులు బాజివాడు దైవమ్ము గనలేక
చుట్టు కోట బెట్టి చూడనీడొ
కోటగమ్య మెఱిగి బూటక మిడవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

403. చట్ట మరయలేక స్వామి లేడందురు
వట్టిమాట లిట్లు వదరనేల
దిట్టమైనగురుడు దేదీప్యమై యుండ
కాళికాంబ! హంస! కాళికాంబ!

404. నాల్గుయుగములందు న్యాయ్యమ్ముగా జూడ
నెన్నదగిన రాజు లెవరుగలరు
గురుని నమ్మువాడు భరతు డొక్కండేను
కాళికాంబ! హంస! కాళికాంబ!

405. పదవులంది పట్టువడకుండు వ్యవహారి
ఇంద్రియముల గెలుచు నిర్ద్వయోగి
హర్షశోకములను నధిగమించు సమాధి
కాళికాంబ! హంస! కాళికాంబ!

406. రాజు జ్ఞానియైన, రాజసంబున నున్న
యోగమెంతొ తెలుపు నుచితరీతి
ప్రకృత మున్న దొరలు పరమాత్ము లవుదురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

405. త్రివిధోహి బ్రహ్మవిత్ -
1. లోకవ్యవహార ప్రధానః 2. వివేక ప్రధానః
3. సమాధి ప్రధానశ్చేతి.
(తైత్తిరీయోపనిషత్‌భాష్యభూమిక)

407. రాజుచిన్నె మీకు లాభం బవునుగాని
యోగిచిన్న మీకు యుక్తమగునె
రాజుచిన్నెమీకు రాగొట్టు పోగొట్టు
కాళికాంబ! హంస! కాళికాంబ!

408. రాజుచిన్నె భరతరాజంత వాడైతె
రాకపోకలెల్ల పోకనిలిచె
రాజయోగమార్గ రమణుండు భరతుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

409. మౌనులైన యతులలో నెవ్వరైనను
సోమయాజులైన శూరులైన
ఆడువారి తల్లులని చూడగావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

410. అనకయున్న నేమి యనియేరు పెద్దలు
ఱంకు నెత్తిగొట్టి రాలు వేయు
వేసి వెతలుగొలిపి మోసమ్ము చేయురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

411. పెద్దవారికెల్ల బుద్ధిక్రమం బిది
పిన్నవారికెల్ల పేరులేదు
పిన్న పెద్దక్రమము పేరు లెట్టుల యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

412. మోహపాశములను మొదటనే పెనుబాము
క్రియలు రద్దుపఱుప క్రింది వేఱు
అందమైనజ్యోతి అతడౌట వితగాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

413. పాతికెకును గొన్న భక్తిముక్తులు లేవు
పాతికెకును గొన్న పలువ లంజె
లంజెపక్కపండె లలి నాల్గుపాతికెల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

414. నాల్గుపాతికెలకు నాణ్యంబు చెడిపోయె
పాతికెకునుగూడ భ్రష్ట మాయె
భ్రష్టులైనవారి ఫలమంత పోయెరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

415 కాయమనెడి విల్లు కదలకుండగ బట్టి
బుద్ధియనెడి నారి పొరలకుండ
మన సనేటి యంబు మఱి గుఱి చేయరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

416. మనసు బుద్ధులకును మరసీల గొన్నట్లు
గురుని పాదచింత గూడదాయె
ఎఱుకయనెడి సుత్తె నెగురగొట్టగవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

417. తెలివిలేనిసీల బలమైన దగుటచే
సుత్తెచేత లెస్స మొత్తవలయు
సీల తెగిన వెనుక [1]సిస్తుగా బలుకునో
కాళికాంబ! హంస! కాళికాంబ!

418. కల్లగురుడు కట్టు కల్లకర్మంబుల
మధ్యగురుడు కట్టు మంత్రములను
ఉత్తముండు కట్టు సత్తు చిత్తుల రెండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. సిస్తు=అందము,సొంపు

419. పైని త్రచ్చగాను ప్రకృతిరూపము వెల్గ
చీకటంత విరియు లోకులకును
తరువతరువ నమృతధారలు చిమ్మురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

420. ప్రకృతి విడగగొట్టి పట్టి విఱిచినప్డు
వికృతి యనుగుణమ్ము విఱుగబోదు
ప్రకృతిపుటమునుంచి వికృతిని గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

421. మేళ మెంతొ చేసి మెప్పులు గనెనయా
మేళజతలు పదియు మెఱపు నొకటి
పదినిమించి యెంచ బ్రహ్మంబు లేదయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

422. మాయ గుంపుచేసి మఱి తెరువాటులై
యున్నవాని కడకు నున్నవాని
కన్నవారు మోక్షఘనులైరి మునులైరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

423. నిన్ను జూతునన్న తన్ను దా గనలేడు
తన్ను జూతునన్న నిన్నుగనడు
నిన్ను గన్నయపుడె సున్నయౌ నన్నియు
కాళికాంబ! హంస! కాళికాంబ!

424. మాయలంజె యొకటి మర్మంబు గననీదు
పంచనున్నలంజె ప్రక్కజేరి
అల్ల రెంతొ చేయ నిల్లంత చెడిపోయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

425. [1]ఇద్ద రంటకుండ హద్దుగా తిరుగాడు
వాడె గొప్పవాడు వసుధలోన
సర్వసిద్ధుడౌను సర్వంబు తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

426. బుద్ధి పురుషుడాయె, పొలుపారు మోహంబు
ఆడుదాయె, నెల్ల ప్రాణులకును;
సృష్టిలోన నిదియె చిత్రాతిచిత్రంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

427. మంచికన్నులైతె మాయ జూచినవేళ
చలన భావ మేల కలుగు జగతి?
మంచికన్నులైతె మాలిన్యమే లేదు;
కాళికాంబ! హంస! కాళికాంబ!

428. ఎట్లు [2]నిస్సరణమొ? ఏమొకో మహిమమ్ము?
శివుని మాయ యేమొ? చెప్పరాదు
అనుచు బ్రహ్మవిదులు కనుగొని రాజ్యోతి
కాళికాంబ! హంస! కాళికాంబ!

429. ఎంత లెక్క వేయ నేమి కాంచగలారు
పన్ని యన్నికంటె ప్రబలువారు
ప్రబలుట యిదిగాదు పన్నిద మ్మిదిగాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

430. మాట తెరకు నెక్కు మరుగుపెట్టుట చెప్పె
నొండు తిరముచేసి రెండు పెట్టి
మూడు భాగహారముం జేయ సున్నయౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. ఇద్దరు=పాపపుణ్యములు    2. నిస్సరణము=ముక్తి

431. అయినలెక్కనంత నావల బెట్టుచు
రెండు తిరముచేయ మూండు పెట్టి
అయిదుతోడ భాగహారింప నొకటాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

* 432. లెక్క యొకటి నిలిచె రేచింప పూరింప
రానుపోను విశ్వరాము డాయె
చిక్కుదీరిపోవ లెక్క యొక్కటి యాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

433. ఒక్కటొక్కటి తెర పెక్కండ్రు గలవయా
ఒక్కమనసుతోడ నిక్కకుండ
త్రొక్కిపట్టు సరికి చిక్కును బ్రహ్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

434. ప్రజ్ఞయనెడి గురుడు పంచనే యున్నాడు
సూక్ష్మదృష్టితోడ జూడవచ్చు
అజ్ఞులైనవార లంధులై పోదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

435. తనకు దారి తెలుప తనవెంట గురుడుండ
కల్లగురులపైన కాంక్షలేల?
కల్లసత్యములకు నెల్ల గురుం డుండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

436. అడవిలోన గురుడు పడి యాకటంబడి
అడవినెల్ల తినెదమంచు జూడ
[1] పరికె గచ్చపొదలు బలిసియున్నవికదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. పరికె=శృంగాటకము. (నాల్గుదారులుకలియుచోటు=చౌరస్తా)

437. గుడ్డివానిపైన కుంటివా డున్నాడు
దొడ్డవారి కెల్ల త్రోవ జూప
కుంటివాని గుణము గుర్తించి బ్రతుకరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

438. జీవిలేక పైన చెచ్చెర తిరుగాడు
జీవిలేక నీట చిందులేయు
జీవిభూతములకు శృంగారభూమిరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

439. మనసుకంటె లొచ్చు మఱి దశేంద్రియములు
మనసులొచ్చు బుద్ధిమాన్యతకును
చెలగుబుద్ధి లొచ్చు జీవాత్మకంటెను
కాళికాంబ! హంస! కాళికాంబ!

440. తొట్టిగుడిసెలోన [1]తుఱగలి గలరీతి
పట్టెగుడిసెలోన ప్రబల మాయె
వెట్టినరులు గనుక వెదక నూహింపరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

441. కిటికినుండి సూర్యకిరణమ్ము గనురీతి
ఆత్మలోన మోక్ష మరయవలయు
ఆత్మయనెడి కిటికి కవియెన్ని మూతలో
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

439. ఇంద్రియేభ్యః పరమనో
మనస్సత్త్వ ముత్తమం
సత్త్వా దధికో మహా నాత్మా
మహతోZవ్యక్త ముత్తమమ్ (కఠోపనిషత్-2-6-7)

1. తుఱగలి=వెలుతురు

442. చేతు లెత్తి పట్టి మూతలు గడెదీసి
ముక్తి పథము చేరబోవు నంత
కావలున్నముగురు కకవిక లవుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

443. మోక్షదాతలైన ముగ్గురు దయచేయ
నాత్మలోన మోక్ష మంటుకొనును
వారి హుకుముతోడ వైకుంఠవాసియౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

444. మునుల దొరలహుకుము గలిగి యున్నదిగాన
కావలున్న ముగురు కడకు దొలగి
బాటచూపగలరు వైకుంఠ మిదియని
కాళికాంబ! హంస! కాళికాంబ!

445. ద్వారమందు దొడ్డవార లుందురుగాన
చేరుటకును వలయు వారి హుకుము
గుఱు తెఱింగి వారు తెరువు లిత్తురుగదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

446. వింతచింత అంత సంతకాయగ జూడు
సంతకాయ యొక్క సగముచూడు
సగముసంతకాయ సర్వంబ యనిచూడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

447. [1]విషపు సూకరమును విదళించి కొట్టగా
విష మదెవరికైన విదలగొట్టు
విషముగొట్ట పెక్కువింతలు పుట్టురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. విషము=జలము

448. మానినులను తల్లిగా నాత్మనెంచిన
సందియమ్ము లెల్ల సమసిపోవు
సమసిపోవ తాను సర్వేశ్వరుం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

449. తనకు తల్లి నిజము తప్పక చూచిన
తనకు తాను బ్రహ్మ తారకంబు
బ్రహ్మసూత్ర మద్ది బ్రహ్మమ్మ యదియౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

450. విద్యలెల్ల నీవ వెలదు లెల్లరు నీవ
నిఖిలవిశ్వమందు నిండియుంటి
శ్రుతుల, స్మృతుల మించు నుతిపాత్ర మౌదువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

451. తఱచుమాటలేల తత్తుల్య మే కాని
యిరుగు పొరుగు మాట లరయ నేల?
పరమయోగియైన పలుమాట లవియేల?
కాళికాంబ! హంస! కాళికాంబ!

452. [1]భావనమ్ము చూడ పరశివసూత్రమ్ము
గోవునకును వలదు కొట్టుతిట్టు
భావమందు నీవు బ్రహ్మమ్ము చూడరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

450. విద్యాః సమస్తాః తవ దేవి! భేదాః
స్త్రియః సమస్తాః సకలాజగత్సు
త్వయైకయా పూరిత మంబ యైతత్
కాతేతిస్తుః స్తవ్య పరాపరోక్తిః

(దేవీ మాహాత్మ్యము)

1. భావనము=తలపు

453. పరమయోగియైతె బ్రహ్మమ్ము బ్రహ్మమ్ము
పరమయోగియైతె పలువ పలువ
పరమశివుడుగాగ భావన భావన
కాళికాంబ! హంస! కాళికాంబ!

454. బ్రహ్మమందు నీద పరులకు కష్టమ్ము
బ్రహ్మమందు నీదు పరమయోగి
బ్రహ్మ తెప్పచేసి ప్రకృతిలో నీదరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

455. తెప్పమాత్ర తెలిసి తేలి యీదగవలె
ఈతమాత్ర తెలిసి ఈదవలెను
లోతు పాతు తెలిసి లోకంబు గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

456. ఆత్మ సింధు వందు నది యీదరాదయా
బయలు సంద్రమందు బారయీది
లోనిసాగరమ్ములో యము డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

457. కాలయముని యాట కట్టించబోయిన
కాలయముడు తోలితోలి కొట్టు
కాలయముని గళము ఖండించురా కాళి
కాళికాంబ! హంస! కాళికాంబ!

458. పంచశతముకోటి బ్రహ్మాంబు లుండగా
నెంచ శక్యమగునె యెవరికైన?
కొంచెమైన కుక్షికోటలో శివు డుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

459. అందఱందు శంభు డానందమైనాడు
కొందఱందు నుండి యందనట్లు
కాంచ వారినీరి కర్మబంధ మదేమొ?
కాళికాంబ! హంస! కాళికాంబ!

460. నీచమైన కోట్ల యోచన లెందుండు
యోచనలను దృష్టి యొప్పుచుండు
సృష్టిజాణలోన చిక్కి నక్కినదయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

461. కన్నులకును పొరలు కడకు వీడితెగదా
జ్ఞానమనెడి జ్యోతి కానవచ్చు
కన్నులకును మాయ గప్పి [1] మబ్బున వేసె
కాళికాంబ! హంస! కాళికాంబ!

462. అప్పటికిని బుట్టె నది చెప్పగా వద్దు;
తిరిగి మరలరాగ తెలియవలదె?
అదియు తెలియువాడె ఆనంద బ్రహ్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

463. భద్రమైన బాహుబలము సద్గురు కుండె
పరమభద్రమైన భావ ముండె .
భద్ర మొసగునట్టి బ్రహ్మమే గురువురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

464. పగలు రాత్రి నాల్గు పదవు లందగవచ్చు
గురువు శిష్యు డనెడి గుఱుతె యుంటె;
గుణమువంక పోతె గుడ్డెద్దు చందమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. మబ్బు=చీకటి (కడపమాండలికము)

465. మంచిచెడ్డలెల్ల మది బొంగరము చేసి
కుడియెడమల వేయు గురువరుండు
ఆత్మబొంగరముల నాడింప నేర్చురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

466. ప్రకృతి యోచనముల, బైరాగివేషాల
పూజచేయ నేమి పుణ్యమబ్బు?
ప్రకృతి దీసివేయ ఫలమబ్బు ముబ్బడి
కాళికాంబ! హంస! కాళికాంబ!

467. ప్రకృతి గురువు పూజ పట్టనేరాదయా
ప్రకృతి మ్రింగు గురుని పాదపూజ
పాదపూజ బ్రహ్మభావన నిక్కమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

468. ప్రకృతినంత తీసి పట్టి ముల్లెగ గట్టి
పెట్టెలోన బెట్టు పెద్ద లరుదు
వేమనంత పెద్ద వెదకి పట్ట గలాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

469. కూటికొఱకు నరులు గూపెట్టి చత్తురు
కూటికొఱకు జనము కుదురు పడును
కూడులేకయున్న గురుడు శిష్యుడు లేడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

470. దారినడచునట్టి వారి కెల్లరకును
హక్కులొకటె యనుచు ఋక్కు పలికె;
హెచ్చుతగ్గు లెట్లువచ్చెనో తెలియదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

470. సమానో అధ్వా ప్రపతా మనుష్యదే. (ఋగ్వేదము-2-13-2)

471. మనసులోన సుంత మలినమ్ము పుట్టినా
మనసులోని ప్రభువు మాయకాడు
అజ్ఞు డరుగుదెంచ నటు పడి యురుకురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

472. మనసు నిర్మలమగు మనసు తా గనుగొన్న
మనసులోన నున్న మాయ గనిన
మనసె జ్యోతి; మనసె మార్గమ్ము ముక్తికి
కాళికాంబ! హంస! కాళికాంబ!

473. మనసునకును గురునకును మహావైరమ్ము
అవునొ కాదొ పెద్ద నడిగి చూడు
నేర్పు పెద్దలైతె నిగ్గదీతురు దీని
కాళికాంబ! హంస! కాళికాంబ!

474. వెఱ్ఱివానికైన వేయిపర్వులనేల
వెదకవచ్చు- మనసు వెదుకలేడు
మనసు నిలిపివేయ మాయ పోగొట్టదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

475. మనసుకంటె వేఱె మహిమంబు లేదయా
మనసు కొక్కటిగుఱి మాయకాడు
మాయకానిలోని మర్మంబు గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

476. మనసు శుద్ధమైతె మఱి దండమేటికి?
మనసు శుద్ధమైతె మంచిదనుట
మంచిచెడ్డ లెల్ల మానసంబేకద!
కాళికాంబ! హంస! కాళికాంబ!

477. మానసమ్ము దొడ్డ మఱి యెవ్వరికినైన
సుఖము దుఃఖములకు సూత్రధారి
సూత్రమర్మ మెఱుగ సుఖదుఃఖములు లేవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

478. మనసు లొంగదీయ మఱి మూడుగలవయా
చూపు,రూపు కోర్కె - చుట్టిపట్టి
మట్టుచేయ ధ్యానమర్యాదగా నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

479. ఆత్మతత్వమున మహావాక్యములు నాల్గు
వివరణ మ్మొనర్ప వినిన కనిన
వాడె హరియు హరుడు పరమేష్ఠిగా మాఱు
కాళికాంబ! హంస! కాళికాంబ!

480. మూటిపైన జూడ మున్నూరు కోట్లకు
శత్రుపంపు లుండు చంప నెపుడు
అదిగొ పంపువచ్చె నరసి ఖండింపుము
కాళికాంబ! హంస! కాళికాంబ!

481. భావభావమందు పంపు చప్పున వచ్చు
పంపు త్రెంచివేయ భావ మమరు
భావమనగ బ్రహ్మభావమ్ముగద చూడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

482. పంపు చొరవకుండ పరిహరించును యోగి
కొంప చెఱుపకుండ పంపుపోవు
అంకు సున్నయైతె రఘురాము డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

483. ఎఱుకయైన పంపు నేర్పడ మెడబట్టి
కోడి జాతరందు కొట్టినట్లు
గురుని చూపు నిలిపి కొట్టు బ్రహ్మజ్ఞాని
కాళికాంబ! హంస! కాళికాంబ!

484. హోత్తు ఛీలు పంపు నవగ వేయును భోగి
చిచ్చి ఛీయనంగ చేరకుండు
మీసమింత మెలిపి మీటగొట్టునుయోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

485. చిచ్చి ఛీయటన్న చిత్తు దేవతయగు
చొచ్చొ చోయటన్న చొచ్చు గీము
మండపమును జేర కుండలి రేగురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

486. చిత్తు దేవ తెట్లు చీయన నేర్చును
అంజనమ్ము చిక్కు నతడె యనును
చిక్కినట్టివారి చిన్నె లికేలరా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

487. సర్వదేవతలను సర్వమతాలను
సమముగా నెఱుంగు సజ్జనుండు
దుర్జనుండు లాతి దోషమ్ములను నెంచు
కాళికాంబ! హంస! కాళికాంబ!

488. జిహ్వా పృథివిగుణము చిక్కెఱుంగగ నీదు
పుడమి ఎంత పూరి పుట్టుచుండు
పూరి పుట్టురీతి బుద్ధులు పుట్టురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

489. చిక్కు చెక్కునతడు జీవు డెన్నగ త్వష్ట
భావమెంచిచూడ బ్రహ్మ మతడు
వాని పే రదేమి? వాడె పరశివుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

490. అట్టి శివుని పాదమంటి కొల్చినవారు
భోగభాగ్యములను పొందగలరు
కానినాడు వాడు [1]గాలి మేయగవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

491. హరిహరులకు పూజ లాచరించెడు వేళ
జ్ఞానహీను డొడలు దాన మిచ్చె
పొమ్మటన్న దెఱిగి పోగొట్టవలె నాడల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

492. ఇట్టి దివ్యభవన మిందేరు వత్తురు
దాత లెఱుకవాండ్రు తత్వగాండ్రు
శివుని ముట్టకుండ చిందొందగొట్టరో
కాళికాంబ! హంస! కాళికాంబ!

493. గళమునందు నిలువ గాయత్రిమంత్రంబు
బడవమాంత్రికులతొ గొడవ యేల?
సూత్రధారి ముక్తి చూపగా నోపడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

494. గుదమునందు క్రింద కుండలి యుండగా
మెడను నూలుపోగు లిడగ నేల?
వేచి యూర్ధ్వముఖము రేచింపవలె సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. గాలి మేయగవలె=నింద ననుభవించవలె.

495. రెంటిలోన పొరలి రేచింపవలెనయా
రేచిరేచి నించి లేపవలెను
లేపి గురునిపాదరేణువు గనిరయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

496. ఉత్తమోత్తమమ్ము లుచ్ఛ్వాస నిశ్వాస
పంక్తు లరసి తాను బ్రహ్మ మగుట
ముసుగులోన శివుడు పొసగియున్నాడయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

497. పట్టుదోవతులును పై పచ్చడంబులు
ఎక్కువైన సొమ్ము లెందుకొఱకు?
చక్కదనముతోడ చావు తప్పక యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

498. ఎఱ్ఱబట్ట గట్టి తొఱ్ఱిమాటుల నాడె
పట్టెయోగిగాని పదవి గాదు
తెల్ల పచ్చ యెఱ్ఱ నల్లరంగు లొకండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

499. బూతి పూసెనేని పుట్టువు చెడవలె
మట్టుచేయు భూతి మాయభూతి
భూతి పూసెనేని పుట్టిగిట్టు టుళక్కి
కాళికాంబ! హంస! కాళికాంబ!

500. పట్టెవర్ధనములు బాగుగా ధరియించి
పాపజాతి మనసు పట్టలేదు
మనసు బిగ్గబట్టి మహిమ గన్గొనుమయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

501. పరమభాష్యకార భక్తుల కీభూమి
నిహము పరము రెండు నీయవలెను;
ఈవు లంది భక్తు లిటనట తరియింత్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

502. పరమభాష్యకార భక్తుడైతే భువి
హరిహరులకు పూజ లతడు నేర్పు
ముక్తి కర్తయైతె మోక్షంబు నిచ్చురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

503. పట్టుపట్టి చూడ వైకుంఠ కైలాస
ములను లేవు తీర్థములను లేవు
భక్తజనుల హృదయపద్మాల నుందువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

504. శరణు శరణటంచు కరములు జోడించు
దీనజనుల కెల్ల దిక్కు నీవె
పారమార్థికముగ నారాయణిని నీవె
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

502. నాహం తీర్థే న కైలాసే
వైకుంఠే వా న కర్హిచిత్
వసామి కింతు మత్ జ్ఞాని
హృదయాంభోజ మధ్యమే. (దేవీగత)

504. శరణాగతదీనార్త
పరిత్రాణపరాయణే
సర్వస్యార్తిహరేదేవి!
నారాయణి నమోస్తుతే. (మార్కండేయపురాణము)

505. సప్తకోటి మంత్ర సాధకు లెవరయా
సప్తకోటిమంత్ర సంజ్ఞ లెఱుగ
సప్తకోటిమంత్రసంజ్ఞ లొక్కటె సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

506. మంత్రతంత్రములకు మాతృకామూర్తివి
పదములకును జ్ఞానపథము నీవు
శూన్యజాలమునకు శూన్యసాక్షిణి వీవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

507. కడుపు హెూమగుండక్రమ మౌట తెలియరో
క్రమము దెలియకున్న కష్టమగును;
కడుపులోన చిచ్చు కార్చిచ్చు పైపెచ్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

508. కారుచిచ్చుకింత క్రమముతో వేయుము
క్రమము తప్పెనేని కళలు లేవు
కళలె యీశుడౌట కార్చిచ్చునకు భుక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

509. చిచ్చు కెవడు భుక్తి సీమలో బెట్టిన
చచ్చె నొచ్చె ననడు సాధకుండు
హెచ్చుకొలువులోన నుచ్చస్థితిగ నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

506. మంత్రాణాం మాతృకా దేవీ
శబ్దానాం జ్ఞానరూపిణే
జ్ఞానానాం చిన్మయాతీతా
శూన్యానాం శూన్యసాక్షిణే! (దేవీగీత)

510. హోమగుండమం దహో! మంత్రముల్ చెప్పి
పూజచేయ నేమి పుణ్యమబ్బు?
హోమగుండ మున్న భూమి కానగవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

511. అష్టదిలనున్న ఆగుండమే గాని
యిష్టమైన గుండ మెఱుగలేరు
కష్టమైనలోని కార్చిచ్చు గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

512. సత్యసంధులకును సంతోష మొసగును
శిష్టలోకమునకు నిష్టము లిడు
రాజపూజితవు సరస్వతి వీవె కా
కాళికాంబ! హంస! కాళికాంబ!

513. సర్వశుభము లీయ శాంకరి వౌదువు
భవ్యవాక్కులీయ వాణి వీవ
కోరుకుల నొసంగు నారాయణివి నీవ
కాళికాంబ! హంస! కాళికాంబ!

514. పరమశివుడుగూడ గురురూపిణిగ నిన్ను
త్రిపురసుందరిగను హృదిని భక్తి
దలచి కొలిచె ననియె లలితా సహస్రమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

512. చోదయిత్రీ సూనృతానాం
చేతంతీ సుమతీనాం
యజ్ఞం దదే సరస్వతీ. (ఋగ్వేదము 1-3-11)

515. వేదభాగమందు షోడేవి సంస్తుతుల్
కొల్లలుగనుజేసి కొలిచి మునులు
యాగభాగముల సహాయమ్ము లందిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

516. యుగయుగాంతమందు నగపడకుండిన
నాల్గువేదములను నలువ యాన
మునులు పూర్వకాలమున వ్రాసిపెట్టిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

517. కాలసర్పమనెడి కార్చిచ్చు చెలరేగి
నిక్కనీని బుద్ధి నిలువకుండె
చక్కనైన బుద్ధి [1] సాయుజ్య మిచ్చురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

518. గుండగొయ్యయైన కుమలక కుమలక
దండియేడ్పులేడ్పు మెండుగాను
దండె చాపి తెలిపె చండాలకన్యక
కాళికాంబ! హంస! కాళికాంబ!

519. అంకులాడి బొంకు రాదెల్ల శక్యమా?
కుంకముండయైన కుమిలి తెలుపు
కుంకఅంకులాడి కూర్చును శివుడయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

516. యుగాంతే తర్హితాన్ వేదాన్
సేతిహాసాన్ మహర్షయః
రేఖిరే తపసా పూర్వ
మనుజ్ఞాతా స్వయంభువా. (తైత్తిరీయసంహిత 1-1-1)

1. సాయుజ్యము=సహ యోగము (పరబ్రహ్మములో లీనమయ్యెడిపదవి)

520. పతియె వ్రతముగలది పరమార్థముగ నుండు
బండముండ యుండు ప్రౌఢిగాను
బండముండదాని పతివ్రత యందురా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

521. పరమపతివ్రతకును పతి అంకు వేసెనా
[1] గుండతొత్తుగాదు కుమిలి యేడ్వ
పరమసాధ్వియైన పరశివు నంటురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

522. ఎందునైన నొకటె యెద్దైన నొక్కటే
బుద్ధిగలిగియుండ పొడము దేహి
తరిమి పొడువవచ్చు తాడుతెంపులమారి
కాళికాంబ! హంస! కాళికాంబ!

523. అర్చకుండు ద్వారమందునే యున్నాడు
దేవునింత గనక దేవులాడి
వాగివాగి వాడు వాగునబడి చచ్చె
కాళికాంబ! హంస! కాళికాంబ!

524. అర్చకుండు మివుల చర్చించి "నీవార
శూకవత్తు " వెల్గు చూడ నేర్చు
దేవతార్చకుండు దేవుని కనుగొను
కాళికాంబ! హంస! కాళికాంబ!

525. శివుడు లేనిచోట శివయుండ నేరదు
శివయు లేనిచోట శివుడు లేడు
శంకరుండు శివయు చంద్రచంద్రిక లట్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. గుండతొత్తు=గుడ్డకైవచ్చినలంజె, గుండ=గుడ్డ

525. న శివేన వినా దేవీ దేవ్యాచ న వినా శివః
నైతయో రంతరం నాస్తి చంద్రచంద్రికయో రివ.

(కామకలావిలాసము)

526. ఋషులు పల్కి "రేవ మేషాపరాశక్తి"
యనుచు సృష్టిచేసి రంబ యంచు
ఈశ్వరేచ్ఛ ననుసరించి యీశ్వరి యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

527. సమయ మెట్టు లగునో యముడు ధర్మ మెఱుంగు
నేల యిట్టు లగుట యెవరి కెఱుక
సర్వవిషయములును స్వామికి దెలియవా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

528. ఆశపాశములకు కూసమ్ము దొడుగక
కాశిపోదునన్న కలదె ముక్తి?
ముక్తి దూరమంచు మొఱలిడ వినలేదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

529. కూపజలములందు కూర యేరినరీతి
బియ్య మెంతో కడిగి పెట్టినటుల
చాకి చీరముఱికి చంపిన విధమయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

530. కూపమందు ముఱికి గూల్చి తీర్థము దెచ్చి
కడిగి పడియవేసి కాలవైచి
మేలితీర్థమంచు గ్రోలుటయే ముక్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

526. ఏవ మేషా పరాశక్తిః ఈశ్వరేచ్ఛానువర్తినీ
స్థిరం చరంచ యద్విశ్వం సృజతీతి వినిశ్చయః (దేగీత)

531. ఉత్తమంబు తీర్థ మొడలందె యున్నది
మధ్యమంబు గలదు మనసునందు
మంచితీర్థమెల్ల మనలోన నున్నది
కాళికాంబ! హంస! కాళికాంబ!

532. తీర్థయాత్రలందు దేవు డొక్కడెగదా
మంచి తీర్థము మన పంచనుండె
దివ్య తీర్థ మిదిగొ దేహమం దున్నది
కాళికాంబ! హంస! కాళికాంబ!

533. యాత్రలెల్ల వెదక నాత్మలో నుండగా
యాత్ర దిరుగువార లధము లెన్న
యాత్ర కాత్మసాక్షి యందులో శివకాశి
కాళికాంబ! హంస! కాళికాంబ!

534. పర్వతంబు చూడ పదియునై దామడ
పరుగులెత్తిపోవు పలువయోగి
యోగి నిజమయైతె యొద్ద పర్వత ముండె
కాళికాంబ! హంస! కాళికాంబ!

535. అయిదుగాండ్ల రథము నధికుడొ నొకరుండు
అయిదుకోటలందు నమరియుండు
బండి విఱిగిపోయె పరమేశు డున్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

536. బండి పరమశివుడు పట్టియుండెడి చోటు
కొంటెకాండ్ర బట్టి కొట్టవలద
పరమశివునితోడ బండి పరంజ్యోతి
కాళికాంబ! హంస! కాళికాంబ!

537. పట్టణ మొక్కండు పల్లెలు పండ్రెండు
కొల్లగాండ్రు ధనముగొట్టువారు
కొట్టుతిట్టువారు గుట్టుగా మట్టెరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

538. చాలగలదు హింస సంసారమందున
పసిడియందు హింస ప్రబలియుండు
హింస చేతునన్న నిక ముక్తి లేదయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

539. మాయయందు మణగి మమత దీసెదనన్న
కామ, క్రోధములును ఘనత కెక్కె
ఘనత కెక్కువారు ఘనులైరి కొందఱు
కాళికాంబ! హంస! కాళికాంబ!

540. మొండిబండలైన గండభేరుండాల
గ్రద్ద లెగురదన్ను కాలమాయె
తన్నవచ్చు గాని తనుదాను జచ్చును
కాళికాంబ! హంస! కాళికాంబ!

541. ముల్లుగట్టి కెపుడు ముల్లు ప్రాణంబగు
కడమజీవులకును కత్తి మొనయు
కలము, గంట మెన్న కరణాల ప్రాణమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

542. కరణ మొక్కరుండు కను విశ్వమెల్లను
కానలేడు వాడు కడమవ్రాలు
కడకు వ్రాయువ్రాత కనుగొని బ్రతుకుడీ
కాళికాంబ! హంస! కాళికాంబ!

543. పంచభూతవికృతి భ్రాంతుల బోకుడు
పొంచి పొంచి పంచభూతములను
వంచనమున వాని వంచ ముక్తియు లేదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

544. పంచభూతివికృతి భ్రాంతి నుంచితె మిం[illegible]
పంచభూతివికృతి భ్రష్టులైరి
పంచభూతవికృతి భ్రమలె బ్రహ్మంబురా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

545. వింటిరే మహాత్మ! యింటిలో నొక్కండు
తొంటి ముండకొడుకు దోసకారి
కాము డనెడివాడు కడతేఱ నీయడో
కాళికాంబ! హంస! కాళికాంబ!

546. వాని కింక నొకడు వచ్చెనా సైదోడు
క్రోధ మనెడువాడు కొంటెకుక్క
కుక్కలకునుబుద్ధి కొట్టిన వచ్చునా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

547. ఇద్దరకును జతగ నింకొక్క డున్నాడు
లోభిముండకొడుకు లోకమందు
ధరణి వీరినడత లెఱుగుదు రార్యులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

548. ముగ్గి రేకమగుచు మొఱపెట్టుకొన్నారు
మోహమనెడి వాడు మొదటి రాజు
కొల్లబోవు నూరు కొట్టుకో మన్నాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

549. ఊరు కొల్లబోవు నుపమ చెప్పుమటన్న
మదము నేనుగ యనె మావటీడు
హంకరించు ధర్మమటు [1]తుర్లగొట్టునో
కాళికాంబ! హంస! కాళికాంబ!

550. తుర్లగొట్టువాడు తులువకత్తియెకదా
2తుఱ్ఱుగొట్టువాని తోడొకండు
మత్సరమనె ముచ్చు మాయనాయకు డుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

551. ఆత్మసీమనేల నార్గురు రాజులు
మదము, క్రోధ, లోభ, మత్సరములు
కామ,మోహములను ఘనులు దుర్జయులయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

552. ఎఱుగనట్టివార లెఱుగనే యెఱుగరు
ఎఱిగియున్నవార లెఱుకవారు
ఎఱిగి మర్మ మరసి రెంతెంతవారలో
కాళికాంబ! హంస! కాళికాంబ!

553. చీకు లేక చూడు వైకుంఠశిఖరాన
ముగ్గు రీతకాంద్రు మూట నిలిచి
వచ్చినట్టివారి భంగ మొనర్తురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

554. అయ్యొ! యింక నెట్టు లంతటింతట గూడి
మెల్లమెల్ల కుదురు మేల్మిచేసి
తిన్నగాను ముగుర దిగనాడ్చురా! యోగి
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. తుర్లగొట్టు=తోలు 2. తుఱ్ఱుగొట్టువాడు=తొందరపడువాడు

555. ముగురి హుకుములైతె మూలలింగానకు
పూజచేయ భుక్తి ముక్తి గలుగు
హరిహుకుములేక తీఱునా శివపూజ
కాళికాంబ! హంస! కాళికాంబ!

556. పుష్యమాసమందు పొగవచ్చు నీటిలో
విధము బాగుగాను వెదకి కనుడి
మంటిలోపల పొగ మహి మేమొ గనరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

557. అగ్ని, నీరు,వాయు, వాకాశసారముల్
భూమికి కింత గలుగ పుట్టె పొగలు
పొగలు, మంటలెల్ల భూగర్భమున నుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

558. అగ్గి స్తంభ నమ్ము లదిమాకు దెలియును
జలము స్తంభమన్న సలుపగలము
అగ్నిజలముకట్టు టానందగురుడయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

559. విశ్వదోషములను వివరించి ప్రజలకు
బోధ చేసి మెప్పు పొందవలయు
విశ్వగురు డెవండొ వేదాంతి యత డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

560. విశ్వకర్మ నేను విప్రులు మీరయా
1 రొప్పి యెక్కువనుట రోతగాదె
ఎక్కుతక్కువలకు నెవరయా కర్తలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. రొప్పి=బాధించి

561. యముడు, ధర్మరాజు నమరిన చోటంటె
మనమనస్సులోనె యునికి గలదు
సత్తు ధర్మరాజు, చిత్తు యముం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

562. ఈశు జూచికూడ నిది [1] నిబద్దన లేరు
వాసిలేని యొడలు పాసిపోయె
మోసపోయి నరులు మూర్ఖులై పోయిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

563. స్త్రీలచిన్నె చూచి చిత్తంబు పార్లక
కత్తి కట్టువాడు బత్తిపరుడు
ఉత్తమో త్తముండు కత్తిగట్టును సుమా
కాళికాంబ! హంస! కాళికాంబ!

564. చక్కనమ్మవారు సకలవిశ్వం బంత
మోక్షమమ్మవారు ముక్తికాంత
పుట్టుగిట్టుటలకు భూదేవతే సాక్షి
కాళికాంబ! హంస! కాళికాంబ!

565. ఇపుడు సాక్షి మీకు విపరీతకాలమ్ము
జీవకోటి చావు చెప్పనేల?
చావుపుట్టుకలకు సాక్షి భూదేవత
కాళికాంబ! హంస! కాళికాంబ!

566. నాకు ది క్కెవండు? నడినాళమందున్న
వేగుచుక్కవంటి వెలుగు దిక్కు;
వెలుగుకన్న దిక్కు వెదకిన లేదయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. నిబద్ధి=నిజము

567. జ్ఞానికాక అంకు చంపగా నేరడు
కానలేనివాడు తానె పోయి
అంకులాడిగాని [1]రాపు జ్ఞానెఱుగడో
కాళికాంబ! హంస! కాళికాంబ!

568. అజ్ఞా డింతగాక యధికుండు నెట్లాయె
మగతనమ్ము తరిచి మరులుకొనెను
మరులుకొనుచు జ్ఞానమహిమలు గనెనయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

569. స్వచ్ఛమైన ద్విజుడు సత్తుచి త్తెఱుగును
ధర్మమార్గములను త్రచ్ఛవలెను
త్రచ్ఛలేడు గనుక తా నెట్లు బాపడో
కాళికాంబ! హంస! కాళికాంబ!

570. ఇహము పరము లేని దేమి బ్రాహ్మణ్యంబు
మున్ను గురుతులేని ముచ్చుగాక?
శుద్ధగురుడు నిలుచు చోటును గనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

571. సకలజీవు లాత్మ-సరసుండు బ్రహ్మంబు
సకలజీవులకును సఖుడు గురుడు
సకలరక్షకుండు సంపూర్ణబ్రహ్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

572. జీవులను వధించి జీవికి వేసెనా
జీవదోషములను జిక్కువడును;
జీవహింసచేత చిక్కునా మోక్షంబు?
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. రాపు=నింద

573. బాప లెపుడు కాపువారి పే రనబోరు
పేరు పెంపు లేక విప్రు డగునె?
పెదవు లాడినంత విప్రుండు గాబోడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

574. విడువ ముడువ గల్గి విభవంబు బహుగల్గి
[1]వివరణములు గల్గి విద్యగల్గి
అవునొ కాదొయన్న హరిదాసుదే తప్పు
కాళికాంబ! హంస! కాళికాంబ!

575. వచ్చిపోవునట్టి ముచ్చు [2]బిత్తలి యని
[3] తెరల బిత్త లైన తెలియలేరు
ఉన్నదినములందె నుపకారి గావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

576. వాదభేద ముడిగి పర మొక్కటే యని
పలుకు జనుల కెల్ల బ్రహ్మసాక్షి
శత్రుమిత్రులకును శంకరుం డొక్కడే
కాళికాంబ! హంస! కాళికాంబ!

577. శత్రు డెవడు చూడ మిత్రు డెవ్వాడగు
పాత్రు డెవడు తరిచి పైకి జూడు
నేర్పు సుంత గలిగెనేని బ్రహ్మంబుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

578. మేకలెల్ల గూడి యాకు మేసెడి తావు
తోకచాలు పిల్లమేక వచ్చు
అట్టితీరు భక్తు లాహారి వెనకుంద్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. వివరణములు=వ్యాఖ్యానములు 2.బిత్తలి=దిసమొలవాడు
3. తెరల బిత్తలి=గుడ్డలుండి లేనట్లుండు దిగంబరి

579. ఒల్లు పెల్లుగాల్చు కల్లగురుండైన
ఉల్లమందు కుళ్ళి నెల్ల గాల్చి
కొల్లలాడు ముక్తి చల్లని గురుడైన
కాళికాంబ! హంస! కాళికాంబ!

580. అస్తి,భాతి, ప్రియము లా బ్రహ్మరూపమ్ము
గా- గ్రహించె యోగిగణము మున్ను
రూప, నామములును లోకమ్ము పాలాయె
కాళికాంబ! హంస! కాళికాంబ!

581. పైన ముద్రలైన [1]భగము మీదను లేవె
ముద్రలన్న నింత మురిప మేల?
బుద్ధి భద్రమైన ముద్రల కర్మేల?
కాళికాంబ! హంస! కాళికాంబ!

582. రావణునకునెపుడు రాముడు సరిగాడు
రావణునకు మిగుల ఱంకు వచ్చె
సీత 2 నఱిమిపట్ట చేటు లంకకు వచ్చె
కాళికాంబ! హంస! కాళికాంబ!

583. అంటు ముట్టు దోష మంత చేటాయెనే
అంటుదోష మున్న దనుట తప్పు
కర్మయోనులందు గలిగిరి నరులెల్ల
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

580. అస్తిభాతి ప్రియం రూపం, నామ చే త్యంశపంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్
(శుకరహస్యోపనిషత్)

1. భగము=వైరాగ్యము,జ్ఞానము, మోక్షము

2. అఱిమి=ఆక్రమించి, అఱుముధాతువు

584. నోటిపంటితీట గాట మింద్రియ మాయె
నోటిపంటిదురద నొవ్వుగూర్చె
నోటిదురద బట్టి నోటనే నమలాలి
కాళికాంబ! హంస! కాళికాంబ!

585. నోట నమలునేర్పు నోమిన ఫలమేమి?
నమలు నేర్పులేక నయము లేదు
నేర్పు గలుగునరులు నెఱజాణ లైరయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

586. ఆకసమ్ముపైన అంత శూన్యమ్మని
పలుకు నరులకెల్ల బ్రహ్మ సాక్షి
పిండ మండమైన పృథివి బ్రహ్మాండమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

587. నేల,నీరు నిప్పు, గాలి యాకాశముల్
పుట్టి దేహములుగ పొలుపుగాంచె
అయిదు గురుతెఱుంగు మయుడు బ్రహ్మంబురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

588. భువియు, నీరు,నిప్పు, పవన, మాకాశమ్ము
లెట్లు వచ్చినదియు నెఱుగ లేరు
బెండురీతి వచ్చి నిండె బ్రహ్మాండంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

589. ముచ్చటగను బుద్ధి మొత్తితేనే కాని
సొచ్చెమైన చోటు చూడలేరు
పిచ్చికుక్క గనుక వేటాడబోవునా
కాళికాంబ! హంస! కాళికాంబ!

590. బుద్ధి యేమిచేయు బుద్ధిగదులు వెన్క
మకరమనెడి [1]బిరట మర్లగొట్టు
బిరటయేమిచేయు [2] పిలిపిలి వచ్చిన
కాళికాంబ! హంస! కాళికాంబ!

591. పిలిపిలిగను వచ్చి పలువకు లోనాయె
నిలునిలుమ బిరట నిండ గొట్టు
మకరమనెడి బిరట మర్లగొట్టితె రాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

592. సుకము, దుఃఖములను ముకుళితహస్తులై
[3]ఏష్య మెఱిగి తిరుగు శిష్యులెల్ల
నొకనెల నొకగడియ నో!గురుడా! యంద్రు
కాళికాంబ! హంస! కాళికాంబ!

593. సెల వొసంగు టెట్టు లిల దేవుడైనాడు
సుకృతకర్మతోడ జూచె నన్ను
అజ్ఞతయును దీఱె నలజడులును మాఱె
కాళికాంబ! హంస! కాళికాంబ!

594. ఆకసమ్మునందు నత డున్న వాడని
ఘనులు వెదకివెదకి కానరైరి
పసిడి దానమిచ్చి పరికింప గోరిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. బిరట=రూపాంతరము, బిరడ=మూత
2. పిలిపిలి=ముద్దుముద్దుగా, చిన్నచిన్నగా
3. ఏష్యము=భవిష్యత్కాలము

595. [1]సోపనమ్ములెక్కి శోధించి గుఱిగని
శివుడు నిలుచు [2]మఱుగు చిక్కె ననుచు
పైడి వలనువేసి పట్టిరి ఘనులయా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

596. నీరు త్రాగునట్టి నేర్పు నెఱింగిన
అప్పు,పృథివి, తేజ మన్ని తెలిపె
మంచినీరుత్రాగు మహిమలు గనలేరు
కాళికాంబ! హంస! కాళికాంబ!

597. నంగనాచిచేప నమ్మినట్లనె యుండి
దొమ్మరి లగువేసి తొలగిపోయె
వేటకాడు దాని వెడలిపో నీయడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

598. ప్రకృతిముఖమునందు బలిమి యుక్కుంజీర
తొడిగి వేయువాడు దొడ్డవాడు
గర్భమందు దొడిగి కడవేసి నాడయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

599. మాయకాపురమున మర్మం బెఱుంగక
మరులుచేత పొర్లి మహిమ చూపె
కాయమందు నున్నమాయను గనరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

600. ఇన్నితెరువులేమి యీశుని గానక?
కర్ణమే శివుడని కానవలద?
మన్ను దినెడి తేలు మరియాద యెఱుగునా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. సోపనమ్ములు=సోపానములు,మెట్లు 2. మఱుగు=రహస్యస్థలము

601. నాదబిందువులను నటియించు విశ్వంబు
బిందుబీజమందు పృథివి పొరలె
పొరల రెంటిలోన పొబడి గనరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

602. తనువు తంతిబుఱ్ఱ, తంత్రులె వాయువుల్
తులువలు శ్రుతిచేయ తెలియ లేరు
ప్రణవము [1]మొఱయించి బ్రహ్మంబు గనిరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

603. ఆలుమగల నెడముగా లాగు గురుడయా
వీని నాణ్య మెఱుగ బూని చూడ
గురుడు మొదటిసాడు కులమెల్ల తుదిసాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

604. కాళికాళియంచు కలవరపడనేల
కాళి లోకమాయ కన్నుమూయ
కాళి పైడిబొమ్మ కళలతో వెలుగురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

605. కాళికాళియంచు కలత నందెద రేల
కాళిగాక జన్మ [2]ఖాయ మగునె
కాళిచెంత నున్న కష్టంబు లేదురా
కాళికాంబ! హంస! కాళికాంబ!

606. నాసికాగ్రమందు నాణెమౌ చురకత్తి
[3]ఏస సుంతలేక చేసెనేని
కోసి పాఱవైచు కోయన భూతాల
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

1. మొఱయించి=మ్రోగించి 2.ఖాయము=స్థిరము(వాడుక,విశేష్యము) 3. ఏస=వంకర

607. ముండమోపికైన చాండాలికైనను
ఎగ్గులేక చేతు లెత్తవలెను
ఎగ్గుసిగ్గులేక యెఱుగాలి మర్మంబు
కాళికాంబ! హంస! కాళికాంబ!

608. రాళ్ళుమొదలు క్రియలు రాకడ, పోకడ,
నింద, స్తుతియులేని నిలువు రాళ్ళ
అష్టమతములకును నధికుండు విశ్వుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

609. అదియ శిష్యపథ మహంకార మదియేమి?
లేదులేదు గురుడ! లేత ముదురు
పూవు వాసనలకు పోబడి యున్నదా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

610. మంత్ర యంత్ర, తంత్ర మహిమలు తానైన
గురుడె యాయుధంబు గురువులకును
గురునియాయుధంబు గురుశిష్యులకు గుర్తు
కాళికాంబ! హంస! కాళికాంబ!

611. చదువచదువ బుట్టు చదువున రుచిపుట్టు
మలచి చదువనొక్క తలపు పుట్టు
తలపుపుట్టు చదువు తలప తానేనయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

612. అన్ని యేకమైన నన్వయ మేమాయె
కన్నవిన్నవారు కనరె ఘనులు
నిన్నమొన్నవారి కెన్నగా తరమౌనె
కాళికాంబ! హంస! కాళికాంబ!

613. రూపరహితునకును రూపమ్ము గల్పించి
కర్మకాండ పెంచి కలుషమతులు
ధర్మమార్గములను ధ్వంసమ్ము చేసిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

614. నిర్విశేషమైన నిర్గుణబ్రహ్మమ్ము
సగుణముగను బోధసలిపి జనుల
జడుల జేసివారు మిడిమిడి జ్ఞానులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

615. కోతిపిల్లరీతి గురువుతో నుండిన
శిష్యులకును సుంత చేటురాదు
నమ్మినమ్మకున్న దుమ్ము పాలగుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

616. సర్వధర్మములను సద్గురు పాదాల
చెంత నుంచి కర్మచింత డించి
సంచితము దహించి సకలమ్ము తానౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

617. తనువు ముడుతపడిన తల తెల్లవాఱిన
చెవులు, కనులు, ముక్కు చేవచెడిన
ఆత్మలోని ఆశ హద్దుపద్దులు మీఱు
కాళికాంబ! హంస! కాళికాంబ!

618. భోగ మనుభవింప రోగాల భయమబ్బు;
వాదభయము శాస్త్రవాదమునను
భయములేని దొక్క వైరాగ్యభాగ్యమే
కాళికాంబ! హంస! కాళికాంబ!

619 యోగ మభ్యసించి యోగీశ్వరులు-నాల్గు
యోగములను ముక్తి నొందవలయు
అఱుమెట్టు లెక్క అంబ దర్శనమిచ్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

620. అటమటించు జనుల కానందభోగాలు
వచ్చుగాక నీతి హెచ్చుగాక
కలసిమెలసి బ్రతుకు కాల మేతెంచును
కాళికాంబ! హంస! కాళికాంబ!

621. అజ్ఞతకును మూల మశరీర సశరీర
ములుగ బ్రహ్మసూత్రములను దెలిసె
కలను గన్నవస్తు విలలోన లేనట్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

622. నాల్గుజాతులకును నాగేటి మొనలోన
ప్రాణమున్న దంచు బలికినారు
ఇలను దున్నువారు బలభద్రు లగుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

623. మఱుగుపడినయాత్మ మాయికమా! ఇది
సత్యమా యటంచు జంకరాదు
మఱుగుతొలగ మాయ మాయమౌ ఆత్మకు
కాళికాంబ! హంస! కాళికాంబ!

624. స్వాములనగ ఐహికాముష్మిక ఫలాల
వాంఛ చేయనట్టివారు ధరణి
లోకవాంఛలకును లోబడ గురుడౌనె?
కాళికాంబ! హంస! కాళికాంబ!

625. దివ్యదీప్తితోడ దేహాభిమానమ్ము
లేనివారు పుడమి లేనివారు
పుడమి లేనివారు పుణ్యాత్ము లవుదురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

626. ఆత్మసత్తకంటె నన్యమ్ముగా సత్త
లేనెలేదు చూడ కానరాదు
కానవచ్చుజగము కల్పనమ్మగు మాయ
కాళికాంబ! హంస! కాళికాంబ!

627. కల, సుషుప్తి మాయికములని గుర్తించి
మేలు కట్టిదంచు లీల నెఱిగి
భ్రాంతు లుడుగువారు పరతత్వవిదులైరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

628. పంచకోశములకు పరమైన బ్రహ్మమ్ము
నేనెకాని మేను కానెకాదు
అంచు దలచువార లంబ! నీభక్తులు
కాళికాంబ! హంస! కాళికాంబ!

629. మానసమ్మునందు జ్ఞానవైరాగ్యాలు
కుదురుపడగ ఆశ బెదరి పోవు
ఆశపోవ నంతమొందును దుఃఖమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

630. తృప్తిలేనివాడు దేహిదేహి యటంచు
కన్నకన్నవారి కాళ్ళు పట్టు
కాళ్ళు పట్టినంత కడుపు నిండగబోదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

631. కర్మవాది స్వర్గగమనమ్ము చేయును
బ్రహ్మవాది మోక్షపథము చేరు
జన్మ రహితమగును శాస్త్రార్థములు వీడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

632. మనసుపెట్టి శ్రవణ మననాదుల నెఱింగి
నియతిగలిగి జ్ఞాన నిష్ఠ మెలగి
కర్మసంచయముల గాల్చును గురుమూర్తి
కాళికాంబ! హంస! కాళికాంబ!

633. దుష్టమైనదాని శిష్టమ్ముగా జేయ
ననువుపడును తొల్లిగుణము చెడును
దుష్టశిష్టములకు దూరమ్ము బ్రహ్మమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

634. పుణ్యపాపకర్మములవల్ల మనుజుల
దేహములు జనించి తీఱు తుదకు
పుట్టినట్టివెల్ల గిట్టుటే సాక్ష్యమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

635. చదువు ధనము తపము సౌందర్యము గుణమ్ము
కులము గోత్రములను గలుగు మదము
మానువారె దురభిమానవర్జితు లిల
కాళికాంబ! హంస! కాళికాంబ!

636. నీడరీతి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుల
వీడకుండ బ్రహ్మవిద్య నెఱుగు
వాడె వీరగురుడు ప్రజ్ఞా ప్రపూర్ణుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

637. పరశరీరములను స్వశరీరమట్లుగా
తలచువాడు హింస సలుపబోడు
హింస సలుపనట్టి ఇంగితజ్ఞుడె బ్రహ్మ
కాళికాంబ! హంస! కాళికాంబ!

638. సగుణ బ్రహ్మమైన సద్గుణ దుర్గుణ
వర్గములను జెప్పవచ్చు కాని
నిర్గుణునకు గుణమునిల్ప శక్యమ్మెనె
కాళికాంబ! హంస! కాళికాంబ!

639. బ్రహ్మమెపుడు పుణ్యాపాప రాహిత్యమై
మాయవలన చేర్పు మార్పు గనక
నిష్కళంకమగుచు నిరవద్యమై యుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

640. బ్రహ్మచింతనమున బరగిన చిత్తమ్ము
ఆటుపోటులేక అణగిమణగి
నిర్మలముగ నిలిచి నియమమ్ము పాటించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

641. చరణములను వ్రాలి శరణన్న వారికై
సుకృతఫలములెల్ల చూరలిచ్చు
గురుని మించువారు ధరలోన లేరయా
కాళికాంబ! హంస! కాళికాంబ!

642. వేదవిదుడు గాఢవిషయ విరక్తిచే
దేహబంధములను ద్రెంచగలడు
దేహబంధములను ద్రెంచ దేవుండౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

643. ప్రకృతివలన గలుగు బ్రహ్మాండభాండాలు
పుట్టి చచ్చు నీటిబుడగలట్లు
కలతలేకనిలుచు నిల విరాడ్రూపమ్ము
కాళికాంబ! హంస! కాళికాంబ!

644. అచలుడగుచు నిత్య మానందరూపుడై
సతుల సుతుల ముక్తసంగు డగుచు
శాంతుడైన గురుని రచణసన్నిధి యేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

645. పుణ్యలోకములకు బోయిన పోకగా
పోవువారు వచ్చి పోవుచుంద్రు
వచ్చిపోవుదారి వదలించుకొనవలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

646. కర్మమునకు స్వర్గగమనమ్ము ఫలమగు
జ్ఞానమునకు మోక్ష మౌను ఫలము
జ్ఞానకర్మములకు సరిపొత్తు కుదురదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

647. నిత్యసత్యమయ్యు నిర్వికారమ్మయ్యు
నిర్ణయింపరాని పూర్ణమయ్యు
నిండియుండువెలుగు పండువెన్నెల సుమా!
కాళికాంబ! హంస! కాళికాంబ!

648. స్వాత్మశక్తి కర్మసన్యాస యోగమ్ము
నభ్యసింపవలయు యతివరుండు
ముక్తసంగుడైన మోక్షమ్ము సిద్ధించు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

646. "ద్వయోఃపరస్పరాపేక్షా విద్యతే న కదాచన."
శంకర భగవత్పాదుల-సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము.

649. ఉపనిషత్తులందు నుపదేశికులయందు
శ్రుతులయందు శ్రద్ధ చూపవలయు
శ్రద్ధలేక ముక్తి సాధింప శక్యమా?
కాళికాంబ! హంస! కాళికాంబ!

650. జాడ్య దుఃఖములు నసత్తయు మూడును
మాయలక్షణములు మది దలంప
మాయ వదలిపోవ మనుజుడే యజుడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

651. అస్థిరము శరీర; మందున్న అశరీరి
యైన దాత్మ-నిత్యమనియె శ్రుతులు
ఆత్మతత్వ మెఱుగ నంతట తానుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

652. అఖిలజనులు శాశ్వతానంద మందగా
దుఃఖజాలములను తొలగద్రోయ
కోరుకొనుట సాజమౌరీతి జగతిలో
కాళికాంబ! హంస! కాళికాంబ!

653. వాదభేద ముడిగి వేదాంత విజ్ఞాన
నిశ్చితార్థులైన నియమపరులు
బ్రహ్మతోడ ముక్తిభావన గందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

654. అంతరింద్రియముల నవలోకనము చేయ
చాలువాడు - వాని నేలువాడు
నేనుమేను లెఱిగి నిత్యుడై విలసిల్లు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

650. అసత్తాజాడ్యదుఃఖేద్వే మాయారూపత్రయం త్విదమ్.
(వేదాంతపంచదశి - 15 - ప్రకరణం, 23 శ్లో.)

655. గురుడుచూపు గురుతు పరికించినంతనే
గబ్బుగీమువంటి మబ్బుతొలగు
మబ్బుతొలగ నరుడు మహనీయు డైపోవు
కాళికాంబ! హంస! కాళికాంబ!

656. బోధ చేయువాడు బోధింపబడువాడు
లోకవాసనలకు లొంగిపోక
నిలిచియుందురేని నిర్గుణబ్రహ్మలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

657. బ్రహ్మవిద్య గురునివల సంప్రాప్తించు
నన్యులకును దెలుప నలవిగాదు
ముక్తి గోరునట్టి భక్తుల కిది దారి
కాళికాంబ! హంస! కాళికాంబ!

658. పుస్తకములు చదువ పూర్ణత్వ మబ్బదు
హృదయసంపుటముల చదువవలయు
పారిశుద్ధ్య మొకటె పరమాత్మ చేర్చును
కాళికాంబ! హంస! కాళికాంబ!

659. తిలలరసము లేక దీపమ్ము వెలుగదు
పూవులేక ఫలము పుట్టబోదు
భక్తిలేక జ్ఞానఫలము లభింపదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

660. సుందరులను జూచి సుఖభోగముల జూచి
ధనము చూచి గొప్పదనము చూచి
కన్నుగుట్టెనేని మన్నైను మనుజుండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

661. అన్నమయములైన వన్ని జీవమ్ములు
కూడులేక జీవకోటి లేదు
కూడు దినెడికాడ కులభేద మేలొకో
కాళికాంబ! హంస! కాళికాంబ!

662. స్వానుభవము లేని వారి సల్లాపాలు
చిలుకపలుకులట్లు తలపవలయు
వినుటవలకె యనుభవింప నర్థము కావు
కాళికాంబ! హంస! కాళికాంబ!

663. పరమగురునివలన వైరాగ్య భాగ్యమ్మ
కలుగకున్న ముక్తి కలుగబోదు
ముక్తి నీనిబోధ యుక్తియుక్తము కాదు
కాళికాంబ! హంస! కాళికాంబ!

664. పలుక నేర్చినంత బ్రహ్మానుభవమును
పొందలేరు ముక్తి నందలేరు
త్యాగధనుడుగాని యోగి కానేరడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

665. గురునిబోధ వినక కోటి జన్మము లెత్తి
ఎంతచదువ తత్వ మెఱుకపడదు
బ్రహ్మవిద్య మిగుల భారమౌ దూరమౌ
కాళికాంబ! హంస! కాళికాంబ!

666. ఆత్మనిష్ఠతో నిరాలంబమును జెంది
సావలంబ మానసమును విడిచి
సంచరింప కర్మసన్యాసి యతడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

667. అల్పసుఖము నిచ్చి యత్యంత దుఃఖమ్ము
కలుగజేయు కామ్య కాంక్ష లెల్ల
నిత్యసుఖము బ్రహ్మనిష్ఠ మాత్రము కూర్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

668. ఆత్మతత్వవేత్త లాదర్శవంతులై
నడువవలయు వాంఛ విడువవలయు
చూపరులకు నడత చూపుట మేలౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

669. పెద్దవారిజూచి పిన్నలు నడతురు;
పెద్దవారు తత్వవిదుల గాంచి
మేలుకీళ్ళ నెఱిగి మెలగ వాంఛింతురు;
కాళికాంబ! హంస! కాళికాంబ!

670. చదివిచదివి ధర్మశాస్త్రంబు లన్నియు
బ్రహ్మ మెఱుగనట్టి పామరుండు
కూరలోని తెడ్డు తీరైనవాడౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

671. అమృతరసము త్రావునతడు కోరడు నీళ్ళు;
పరమమైన బ్రహ్మ మెఱుగువాడు
వేదశాస్త్రములను వీక్షింపగాబోడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

666. నిరాలంబం సమాశ్రిత్య
స్వాలంబం విజహాతి యః
స సంన్యాసీ చ యోగీ చ
కైవల్యం పద మశ్నుతే. (నిరాలంబోపనిషత్)

672. మానవుల యొడళ్ళు మాయామలమ్ముతో
నిండియుండు, సుకృత మెండి యుండు
దేహశుద్ధిపిదప దేహి తా శుద్ధియౌ;
కాళికాంబ! హంస! కాళికాంబ!

673. భక్తులైనవారు పరిపక్వబుద్ధిచే
ధ్యానమందు నాత్మ నందగలరు
ఆత్మ నంద శాశ్వతానంద సుఖ మబ్బు
కాళికాంబ! హంస! కాళికాంబ!

674. బ్రహ్మభావ మచలభావమ్ముగా నెంచి
నిర్గుణముగ బ్రహ్మనిష్ఠ నెంచి
మును తరించినారు ఘనులౌ మునీశ్వరుల్
కాళికాంబ! హంస! కాళికాంబ!

675. మాయ గప్పుచుండు మాటిమాటికి దాని
తేటపడ గురూపదేశమునను
మరలగొట్టువాడు మఱుజన్మకును రాడు
కాళికాంబ! హంస! కాళికాంబ!

676. గుండెగూటిలోన గూర్చున్న యాత్మను
సర్వసాక్షియైన సత్తటంచు
బ్రహ్మవిదులు విషయవాసనల్ విడిచిరి
కాళికాంబ! హంస! కాళికాంబ!

677. వేనవేలు శిష్యవిత్తాపహారకుల్
కలరు గురులు భరతఖండమందు;
ఎంచ లేరు శిష్యహృత్తాపహారకుల్;
కాళికాంబ! హంస! కాళికాంబ!

---

675. ఆవృత్తి రసకృ దుపదేశాత్. (బ్రహ్మసూత్రములు)

678. వెలదులకును వేదవిద్యాధికారమ్ము
లేదటంచు బ్రహ్మలిఖిత మంచు
నోరుతెఱచి మఱచినారు వాణిని నిన్ను
కాళికాంబ! హంస! కాళికాంబ!

679. ఆకళింప నతిథు లభ్యాగతుల కెల్ల
రాజయోగ మొకటె రక్షచేయు
ఆశ్రమములలో గృహస్థాశ్రమమె మేలు
కాళికాంబ! హంస! కాళికాంబ!

680. ముక్తికాంతతోడ ముచ్చట లాడగా
దలచువారు బంధములను ద్రెంచి
కొండశిఖరమందు గూర్చుండగావలె
కాళికాంబ! హంస! కాళికాంబ!

681. చిత్తుసత్తులకును జీవుండు సాక్షియౌ
పరగ జీవులకును బ్రహ్మసాక్షి
అఖిలజీవులకును నంతరాత్మయె సాక్షి
కాళికాంబ! హంస! కాళికాంబ!

682. దుష్టభావనములు నష్టమై పోయిన
ధర్మమూర్తి హృదయతత్వ మెఱిగి
మెలగువారు నిన్ను దిలకింప నేర్తురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

683. కుడిగ ముక్కునుండి నడచు పింగళనాడి
ఎడమముక్కునుండి నడచు నిడయు
అడుగునుండి వెన్నునంటి ప్రాకు సుషుమ్న
కాళికాంబ! హంస! కాళికాంబ!

684. మనసుకెన్న చందమామ అధిష్ఠాత
హెచ్చులొచ్చు లుద్భవించు కతన
చంద్రు దాల్చి శివుడు చంద్రమౌళియు నయ్యె
కాళికాంబ! హంస! కాళికాంబ!

685. ఉల్లిగడ్డలకును నుపదేశ మిచ్చెడి
కల్లగురువు లెల్లకడల దిరిగి
లొల్లెగాండ్ర శిష్యులుగ జేసికొందురు
కాళికాంబ! హంస! కాళికాంబ!

686. 'బ్రహ్మమనగ నేమి? బ్రహ్మశబ్దార్థమ్ము
దేనిగుణమువలన దెలియవచ్చు?'
నన్న ప్రశ్న ముదయమంద నీవౌదువు
కాళికాంబ! హంస! కాళికాంబ!

687. పరము తిరము గాని క్షర మక్షరము లంచు
బోధ చేయుచుండు బాధగురువు
త్వష్ట నెఱుగనట్టి భ్రష్ట బోధిదియౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

688. ఆర్తి తీఱుననుచు మూర్తమ్ము పెట్టిన
పెండ్లికూతు రపుడె ముండమోయు;
కంకణాలనాడె కాటి కేగె మగండు
కాళికాంబ! హంస! కాళికాంబ!

689. [1]దాయ మనగ గురుని దర్శనమేగదా!
గెలుచు టనగ మాయ దెలిసికొనుట
మాయ దెలిసి మసలు మనుజు డీశుం డౌను
కాళికాంబ! హంస! కాళికాంబ!

1. దాయము=పంచుకొనదగిన తండ్రిసొత్తు

690. బ్రతుకు మొలకలెత్తు ప్రకృతిని దర్శింప
బ్రతుకు గతుకు లగు నిరాశపడిన
బ్రతుకు చివికిపోవు పరమాత్మ దర్శింప
కాళికాంబ! హంస! కాళికాంబ!

691. ప్రకృతిబంధనమున బడియుండ నరకమ్ము
ప్రకృతినుండి వేఱుపడుటె ముక్తి
ప్రకృతి వికృతిలేని బయలె బ్రహ్మంబగు
కాళికాంబ! హంస! కాళికాంబ!

692. రూఢమైన స్వస్వరూపావధారణే
చీడపీడ లలము చిత్తమందు
మరులుకొన్న ఎండమావుల చల్లార్చు
కాళికాంబ! హంస! కాళికాంబ!

693. సుప్రసన్న వగుచు చూడ ముక్తి లభించు
అప్రసన్న వైన నలము మాయ
నిన్ను నమ్మి కొలువ నిర్మలత్వము గల్గు
కాళికాంబ! హంస! కాళికాంబ!

694. మతము మత్తుగూర్చు మార్గమ్ము కారాదు;
హితము గూర్పవలయు నెల్లరకును;
హితము గూర్పలేని మతము మానగవలె;
కాళికాంబ! హంస! కాళికాంబ!

695. గురులు శిష్యులెల్ల పరిపాలనాపరుల్
పారమార్థికులుగ ప్రబలిరేని
సంఘమందు సుఖము శాంతి వర్ధిల్లును
కాళికాంబ! హంస! కాళికాంబ!

696. సత్య,శీల, ధర్మ సంస్థాపనార్థమై
యుగయుగాల పుట్టు వొందు చంద్రు
సహజశక్తి గల్గు సంస్కారు లిలలోన
కాళికాంబ! హంస! కాళికాంబ!

697. గురుముఖాన విన్న కుండలినీశక్తి
మేలుకొలిపి యాఱుమెట్టు లెక్క
దూరదృష్టితోడ దూరశ్రవణ మబ్బు
కాళికాంబ! హంస! కాళికాంబ!

698. మాన్యమైన కందిమల్లయ్య పల్లెలో
స్థిరనివాస మేరుపఱుచు కొంటి;
కూడియుంటి సాధ్వి గోవిందమాంబతో;
కాళికాంబ! హంస! కాళికాంబ!

699. సకలజాతులకును సాధనమ్ములు గూర్చు
జాతివాడ, వేదనీతి యుతుడ
శిష్యగణముతోడ సేవింపబడువాడ
కాళికాంబ! హంస! కాళికాంబ!

700. కులమతాల జాడ్యములలోన దపియించు
దీనజనుల సేద దీర్చువాడ;
మానవుండె ధరను మాధవుం డనువాడు;
కాళికాంబ! హంస! కాళికాంబ!

701. నా[1]పద్య యెంతొ హృద్యము
నా [2]పద్యము నాకు నవ్వు నాణెము గూర్చున్
నా [3]పథ్యము స్థిరతరమౌ
నా పద్యము యుగయుగాల నడచును కాళీ!

1. పద్య=త్రోవ 2. పద్యము=ఛందోబద్ధమైన కావ్యము 3. పథ్యము= హితము.